శ్రీ మతే రామానుజాయ నమః
శ్రీ రామైనమః
శ్రీ ధరాయనమః

శ్లో॥ విశ్వం విష్ణుర్వషట్కారో, భూతభవ్యభవత్ప్రభుః
భూతకృద్భూతభృద్భావో, భూతాత్మా భూతభావనః
పూతాత్మా పరమాత్మా చ, ముక్తానాం పరమాగతిః
అవ్యయః పురుషస్సాక్షీ, క్షేత్రజ్ఞోఽక్షర ఏవ చ ॥ 2
యోగో యోగవిదాంనేతా, ప్రధానపురుషేశ్వరః
నారసింహవపుః శ్రీమాన్, కేశవః పురుషోత్తమః ॥ 3
సర్వః శర్వః శివః స్థాణు, ర్భూతాదిర్నిధిరవ్యయః
సంభవో భావనో భర్తా, ప్రభవః ప్రభురీశ్వరః ॥ 4
స్వయంభూశ్శంభురాదిత్యః, పుష్కరాక్షో మహాస్వనః
అనాదినిధనో ధాతా, విధాతా ధాతురుత్తమః ॥ 5
అప్రమేయో హృషీకేశః, పద్మనాభోఽమరప్రభుః
విశ్వకర్మా మనుస్త్వష్టా, స్థవిష్ఠ స్థవిరో ధ్రువః ॥ 6
అగ్రాహ్యశ్శాశ్వతః కృష్ణో, లోహితాక్షః ప్రతర్దనః
ప్రభూతస్త్రికకుద్ధామ, పవిత్రం మంగళం పరమ్ ॥ 7
ఈశానః ప్రాణదః ప్రాణో, జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః
హిరణ్యగర్భో భూగర్భో, మాధవో మధుసూదనః ॥ 8

విష్ణుసహస్రనామ స్తోత్రమ్

శ్లో 9 ఈశ్వరో విక్రమీ ధన్వీ, మేధావీ విక్రమః క్రమః
అనుత్తమో దురాధర్షః, కృతజ్ఞః కృతిరాత్మవాన్ 9
సురేశః శరణం శర్మ, విశ్వరేతాః ప్రజాభవః
అహః సంవత్సరో వ్యాలః, ప్రత్యయః సర్వదర్శనః 10
అజః సర్వేశ్వరః సిద్ధః, సిద్ధిః సర్వాదిరచ్యుతః
వృషాకపిరమేయాత్మా, సర్వయోగవినిస్సృతః 11
వసుర్వసుమనాస్సత్యః, సమాత్మా సమ్మితః సమః
అమోఘః పుండరీకాక్షో, వృషకర్మా వృషాకృతిః 12
రుద్రో బహుశిరా బభ్రుః, విశ్వయోనిః శుచిశ్రవాః
అమృతః శాశ్వతస్థాణుః, వరారోహో మహాతపాః 13
సర్వగః సర్వవిద్భానుః, విష్వక్సేనో జనార్దనః
వేదో వేదవిదవ్యంగో, వేదాంగో వేదవిత్కవిః 14
లోకాధ్యక్షః సురాధ్యక్షో, ధర్మాధ్యక్షః కృతాకృతః
చతురాత్మా చతుర్వ్యూహః, చతుర్దంష్ట్రశ్చతుర్భుజః 15
భ్రాజిష్ణుర్భోజనం భోక్తా, సహిష్ణుర్జగదాదిజః
అనఘో విజయో జేతా, విశ్వయోనిః పునర్వసుః 16
ఉపేంద్రో వామనః ప్రాంశుః, అమోఘః శుచిరూర్జితః
అతీంద్రః సంగ్రహః సర్గో, ధృతాత్మా నియమో యమః 17
వేద్యో వైద్యః సదాయోగీ, వీరహా మాధవో మధుః
అతీంద్రియో మహామాయో, మహోత్సాహో మహాబ

విష్ణుసహస్రనామస్తోత్రమ్

శ్లో॥ మహాబుద్ధిర్మహావీర్యో, మహాశక్తిర్మహాద్యుతిః
అనిర్దేశ్యవపుః శ్రీమాన్, అమేయాత్మా మహాద్రిధృక్ ॥ 19
మహేష్వాసో మహీభర్తా, శ్రీనివాసస్సతాంగతిః
అనిరుద్ధః సురానందో, గోవిందో గోవిదాంపతిః ॥ 20
మరీచిర్దమనోహంసః, సుపర్ణో భుజగోత్తమః 21
హిరణ్యనాభస్సుతపాః, పద్మనాభః ప్రజాపతిః
అమృత్యుస్సర్వదృక్సింహః, సంధాతా సంధిమాన్స్థిరః
అజో దుర్మర్షణశ్శాస్తా, విశ్రుతాత్మా సురారిహా ॥ 22
గురుర్గురుతమోధామ, సత్యస్సత్యపరాక్రమః
నిమిషోఽనిమిషః స్రగ్వీ, వాచస్పతిరుదారధీః ॥ 23
అగ్రణీర్గ్రామణీః శ్రీమాన్, న్యాయోనేతా సమీరణః
సహస్రమూర్ధా విశ్వాత్మా, సహస్రాక్షః సహస్రపాత్ 24
ఆవర్తనో నివృత్తాత్మా, సంవృతః సంప్రమర్దనః ॥ 25
అహః సంవర్తకో వహ్ని, రనిలో ధరణీధరః
సుప్రసాదః ప్రసన్నాత్మా, విశ్వధృగ్విశ్వభుగ్విభుః
సత్కర్తా సత్కృతస్సాధు, ర్జహ్నుర్నారాయణోనరః ॥ 26
అసంఖ్యేయో ఽప్రమేయాత్మా, విశిష్టః శిష్టకృచ్ఛుచిః
సిద్ధార్థస్సిద్ధసంకల్పః, సిద్ధిదః సిద్ధిసాధనః ॥ 27
వృషాహీ వృషభో విష్ణుర్వృషపర్వా వృషోదరః
వర్ధనో వర్ధమానశ్చ, వివిక్తః శ్రుతిసాగరః ॥ 28

# విష్ణు సహస్రనామ స్తోత్రమ్

శ్లో॥ సుభుజో దుర్ధరో వాగ్మీ, మహేంద్రో వసుదో వసుః
నైకరూపో బృహద్రూపః, శిపివిష్టః ప్రకాశనః ॥ 29
ఓజస్తేజో ద్యుతిధరః, ప్రకాశాత్మా ప్రతాపనః
ఋద్ధః స్పష్టాక్షరో మంత్ర, శ్చంద్రాంశుర్భాస్కరద్యుతిః 30
అమృతాంశూద్భవో భానుః, శశబిందుస్సురేశ్వరః
ఔషధం జగతస్సేతుః, సత్యధర్మపరాక్రమః ॥ 31
భూతభవ్యభవన్నాథః, పవనః పావనోఽనలః
కామహా కామకృత్కాంతః, కామః కామప్రదః ప్రభుః 32
యుగాదికృద్యుగావర్తో, నైకమాయో మహాశనః
అదృశ్యోఽవ్యక్తరూపశ్చ, సహస్రజిదనంతజిత్ ॥ 33
ఇష్టోఽవిశిష్టః శిష్టేష్టః, శిఖండీ నహుషో వృషః
క్రోధహా క్రోధకృత్కర్తా, విశ్వబాహుర్మహీధరః ॥ 34
అచ్యుతః ప్రథితః ప్రాణః, ప్రాణదో వాసవానుజః
అపాంనిధిరధిష్ఠాన, మప్రమత్తః ప్రతిష్ఠితః ॥ 35
స్కందః స్కందధరో ధుర్యో, వరదో వాయువాహనః
వాసుదేవో బృహద్భాను, రాదిదేవః పురందరః ॥ 36
అశోకస్తారణస్తారః, శూరః శౌరిర్జనేశ్వరః
అనుకూలశ్శతావర్తః, పద్మీ పద్మనిభేక్షణః ॥ 37

విష్ణు సహస్ర నామ స్తోత్రము

~~పద్మనాభో౽రవిందాక్షః పద్మగర్భః శరీరభృత్~~
~~మహర్ధిః ఋద్ధో వృద్ధాత్మా మహాక్షో గరుడధ్వజః~~

పద్మనాభో౽రవిందాక్షః, పద్మగర్భః శరీరభృత్
మహర్ధి ఋద్ధో వృద్ధాత్మా, మహాక్షో గరుడధ్వజః ॥38
అతులః శరభో భీమః, సమయజ్ఞో హవిర్హరిః
సర్వలక్షణలక్షణ్యో, లక్ష్మీవాన్ సమితింజయః ॥39
విక్షరో రోహితో మార్గో, హేతుర్దామోదరః సహః
మహీధరో మహాభాగో, వేగవానమితాశనః ॥40
ఉద్భవః క్షోభణో దేవః, శ్రీగర్భః పరమేశ్వరః
కరణం కారణం కర్తా, వికర్తా గహనో గుహః ॥41
వ్యవసాయో వ్యవస్థానః, సంస్థానః స్థానదో ధ్రువః
పరర్ధిః పరమస్పష్టః, తుష్టః పుష్టః [illegible]
శుభేక్షణః ॥42
రామో విరామో విరజో, మార్గో నేయో నయో౽నయః
వీరః శక్తిమతాం శ్రేష్ఠో, ధర్మో ధర్మవిదుత్తమః ॥43
వైకుంఠః పురుషః ప్రాణః, ప్రాణదః ప్రణవః పృథుః
హిరణ్యగర్భః శత్రుఘ్నో, వ్యాప్తో వాయురధోక్షజః ॥44
ఋతుః సుదర్శనః కాలః, పరమేష్ఠీ పరిగ్రహః
ఉగ్రః సంవత్సరో దక్షో, విశ్రామో విశ్వదక్షిణః ॥45
విస్తారః స్థావరస్థాణుః, ప్రమాణం బీజమవ్యయం
అర్థో౽నర్థో మహాకోశో, మహాభోగో మహాధనః ॥46

# విష్ణుసహస్రనామస్తోత్రమ్

అనిర్విణ్ణః స్థవిష్ఠోభూః, ధర్మయూపో మహామఖః
[illegible]
నక్షత్రనేమిర్నక్షత్రీ క్షమః క్షామః సమీహనః ॥ 47
యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ, క్రతుః సత్రం సతాంగతిః
సర్వదర్శీ నివృత్తాత్మా, సర్వజ్ఞో జ్ఞానముత్తమమ్ ॥ 48
సువ్రతః సుముఖః సూక్ష్మః, సుఘోషః సుఖదః సుహృత్
మనోహరో జితక్రోధో, వీరబాహుర్విదారణః ॥ 49
స్వాపనః స్వవశో వ్యాపీ, నైకాత్మా నైకకర్మకృత్
వత్సరో వత్సలో వత్సీ, రత్నగర్భో ధనేశ్వరః ॥ 50
ధర్మగుబ్ధర్మకృద్ధర్మీ, సదక్షరమసత్క్షరమ్
అవిజ్ఞాతా సహస్రాంశు, ర్విధాతా కృతలక్షణః ॥ 51
గభస్తినేమిః సత్త్వస్థః, సింహో భూతమహేశ్వరః
ఆదిదేవో మహాదేవో దేవేశో దేవభృద్గురుః ॥ 52
ఉత్తరో గోపతిర్గోప్తా, జ్ఞానగమ్యః పురాతనః
శరీరభూతభృద్భోక్తా, కపీంద్రో భూరిదక్షిణః ॥ 53
సోమపోఽమృతపః సోమః, పురుజిత్పురుసత్తమః
వినయో జయః సత్యసంధో, దాశార్హః సాత్వతాంపతిః ॥ 54
జీవో వినయితా సాక్షీ, ముకుందోఽమితవిక్రమః
అంభోనిధిరనంతాత్మా, మహోదధిశయోంతకః ॥ 55
అజో మహార్హః స్వాభావ్యో, జితామిత్రః ప్రమోదనః
ఆనందో నందనో నందః, సత్యధర్మా త్రివిక్రమః ॥ 56

# విష్ణుసహస్రనామ స్తోత్రమ్

శ్లో॥ మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞో మేదినీపతిః
త్రిపదస్త్రిదశాధ్యక్షో, మహాశృంగః కృతాంతకృత్ 57
మహావరాహో గోవిందః, సుషేణః కనకాంగదీ
గుహ్యో గభీరో గహనో, గుప్తశ్చక్రగదాధరః 58
వేధాః స్వాంగోఽజితః కృష్ణో, దృఢః సంకర్షణోఽచ్యుతః
వరుణో వారుణో వృక్షః, పుష్కరాక్షో మహామనాః 59
భగవాన్భగహానందీ, వనమాలీ హలాయుధః
ఆదిత్యో జ్యోతిరాదిత్యః, సహిష్ణుర్గతిసత్తమః 60
సుధన్వా ఖండపరశుర్దారుణో ద్రవిణప్రదః
దివస్పృక్సర్వదృగ్వ్యాసో, వాచస్పతిరయోనిజః 61
త్రిసామా సామగః సామ, నిర్వాణం భేషజం భిషక్
సన్యాసకృచ్ఛమః శాంతో, నిష్ఠా శాంతిః పరాయణమ్ 62
శుభాంగః శాంతిదః స్రష్టా, కుముదః కువలేశయః
గోహితో గోపతిర్గోప్తా, వృషభాక్షో వృషప్రియః 63
అనివర్తీ నివృత్తాత్మా, సంక్షేప్తా క్షేమకృచ్ఛివః
శ్రీవత్సవక్షాః శ్రీవాసః, శ్రీపతిః శ్రీమతాంవరః 64
శ్రీదః శ్రీశః శ్రీనివాసః, శ్రీనిధిః శ్రీవిభావనః
శ్రీధరః శ్రీకరః శ్రేయః, శ్రీమాన్ లోకత్రయాశ్రయః 65
స్వక్షః స్వంగః శతానందో, నందిర్జ్యోతిర్గణేశ్వరః
విజితాత్మా విధేయాత్మా, సత్కీర్తిశ్ఛిన్నసంశయః 66

# విష్ణుసహస్ర నామస్తోత్రమ్

శ్లో॥ ఉదీర్ణః సర్వతశ్చక్షుః అనీశః శాశ్వతః స్థిరః
భూశయో భూషణో భూతిః విశోకః శోకనాశనః ॥67
అర్చిష్మానర్చితః కుంభో విశుద్ధాత్మా విశోధనః
అనిరుద్ధోఽప్రతిరథః, ప్రద్యుమ్నోఽమితవిక్రమః ॥68
కాలనేమినిహా శౌరిః, శూరః శూరజనేశ్వరః
త్రిలోకాత్మా త్రిలోకేశః, కేశవః కేశిహా హరిః ॥69
కామదేవః కామపాలః, కామీ కాంతః కృతాగమః
అనిర్దేశ్యవపుర్విష్ణుః వీరోఽనంతో ధనంజయః ॥70
బ్రహ్మణ్యో బ్రహ్మకృద్బ్రహ్మా, బ్రహ్మ బ్రహ్మవివర్ధనః
బ్రహ్మవిద్బ్రాహ్మణో బ్రహ్మీ, బ్రహ్మజ్ఞో బ్రాహ్మణప్రియః ॥71
మహాక్రమో మహాకర్మా, మహాతేజా మహోరగః
మహాక్రతుర్మహాయజ్వా మహాయజ్ఞో మహాహవిః ॥72
స్తవ్యః స్తవప్రియః స్తోత్రం, స్తుతః స్తోతా రణప్రియః
పూర్ణః పూరయితా పుణ్యః, పుణ్యకీర్తిరనామయః ॥73
మనోజవస్తీర్థకరో, వసురేతా వసుప్రదః
వసుప్రదో వాసుదేవో వసుర్వసుమనాః హవిః ॥74
సద్గతిః సత్కృతిః సత్తా, సద్భూతిః సత్పరాయణః
శూరసేనో యదుశ్రేష్ఠః, సన్నివాసః సుయామునః ॥75
భూతావాసో వాసుదేవః, సర్వాసునిలయోఽనలః
దర్పహా దర్పదో దృప్తో, దుర్ధరోఽథాపరాజితః ॥76
విశ్వమూర్తిర్మహామూర్తిః, దీప్తమూర్తిరమూర్తిమాన్

# విష్ణు సహస్ర నామ స్తోత్రమ్

శ్లో॥ అనేకమూర్తిరవ్యక్తః, శతమూర్తిః శతాననః ॥77
ఏకోనైకః సవః కః కిం, యత్తత్పదమనుత్తమమ్
లోకబంధుర్లోకనాథో, మాధవో భక్తవత్సలః ॥78
సువర్ణవర్ణో హేమాంగో, వరాంగశ్చందనాంగదీ
వీరహా విషమశ్శూన్యో, ఘృతాశీరచలశ్చలః ॥79
అమానీ మానదో మాన్యో, లోకస్వామీ త్రిలోకధృత్
సుమేధా మేధజో ధన్యః, సత్యమేధా ధరాధరః ॥80
తేజోవృషో ద్యుతిధరః, సర్వశస్త్రభృతాంవరః
ప్రగ్రహో నిగ్రహో వ్యగ్రో, నైకశృంగో గదాగ్రజః ॥81
చతుర్మూర్తిశ్చతుర్బాహుశ్చతుర్వ్యూహశ్చతుర్గతిః
చతురాత్మా చతుర్భావశ్చతుర్వేదవిదేకపాత్ ॥82
సమావర్తోనివృత్తాత్మా, దుర్జయో దురతిక్రమః
దుర్లభో దుర్గమో దుర్గో, దురావాసో దురారిహా ॥83
శుభాంగో లోకసారంగః, సుతంతుస్తంతువర్ధనః
ఇంద్రకర్మా మహాకర్మా, కృతకర్మా కృతాగమః ॥84
ఉద్భవః సుందరః సుందో, రత్ననాభః సులోచనః
అర్కో వాజసనిః శృంగీ, జయంతస్సర్వవిజ్జయీ ॥85
సువర్ణబిందురక్షోభ్యః, సర్వవాగీశ్వరేశ్వరః
మహాహ్రదో మహాగర్తో, మహాభూతో మహానిధిః ॥86
కుముదః కుందరః కుందః, పర్జన్యః పావనోఽనిలః
అమృతాంశోఽమృతవపుః సర్వజ్ఞః సర్వతోముఖః ॥87

## విష్ణుసహస్రనామస్తోత్రమ్

శ్లో॥ సులభః సువ్రతః సిద్ధః, శత్రుజిచ్ఛత్రుతాపనః
న్యగ్రోధోదుంబరోఽశ్వత్థశ్చాణూరాంధ్రనిషూదనః ॥ 88
సహస్రార్చిః సప్తజిహ్వః సప్తైధాః సప్తవాహనః
అమూర్తిరనఘోఽచింత్యో భయకృద్భయనాశనః ॥ 89
అణుర్బృహత్కృశః స్థూలో గుణభృన్నిర్గుణో మహాన్
అధృతః స్వధృతః స్వాస్యః, ప్రాగ్వంశో వంశవర్ధనః ॥ 90
భారభృత్ కథితో యోగీ, యోగీశః సర్వకామదః
ఆశ్రమః శ్రమణః క్షామః, సుపర్ణో వాయువాహనః ॥ 91
ధనుర్ధరో ధనుర్వేదో, దండో దమయితా దమః
అపరాజితః సర్వసహో, నియంతా నియమో యమః ॥ 92
సత్త్వవాన్ సాత్త్వికస్సత్యః, సత్యధర్మపరాయణః
అభిప్రాయః ప్రియార్హోఽర్హః, ప్రియకృత్ప్రీతివర్ధనః ॥ 93
విహాయసగతిర్జ్యోతిః, సురుచిర్హుతభుగ్విభుః
రవిర్విలోచనస్సూర్యః, సవితా రవిలోచనః ॥ 94
అనంతహుతభుగ్భోక్తా, సుఖదో నైకజోఽగ్రజః
అనిర్విణ్ణః సదామర్షీ లోకాధిష్ఠానమద్భుతః ॥ 95
సనాత్సనాతనతమః, కపిలః కపిరవ్యయః
స్వస్తిదః స్వస్తికృత్ స్వస్తి స్వస్తిభుక్ స్వస్తిదక్షిణః ॥ 96
అరౌద్రః కుండలీ చక్రీ, విక్రమ్యూర్జితశాసనః
శబ్దాతిగః శబ్దసహః, శిశిరః శర్వరీకరః ॥ 97

విష్ణుసహస్రనామస్తోత్రమ్

శ్లో॥ అక్రూరః పేశలో దక్షో, దక్షిణః క్షమిణాం వరః
విద్వత్తమో వీతభయః, పుణ్యశ్రవణకీర్తనః ॥ 98

ఉత్తారణో దుష్కృతిహా, పుణ్యో దుఃస్వప్ననాశనః
వీరహా రక్షణస్సంతో, జీవనః పర్యవస్థితః ॥ 99

అనంతరూపోఽనంతశ్రీ, ర్జితమన్యుర్భయాపహః
చతురశ్రో గభీరాత్మా, విదిశో వ్యాదిశో దిశః ॥ 100

అనాదిర్భూర్భువోలక్ష్మీః, సువీరో రుచిరాంగదః
జననో జనజన్మాదిః, భీమో భీమపరాక్రమః ॥ 101

ఆధారనిలయోఽధాతా, పుష్పహాసః ప్రజాగరః
ఊర్ధ్వగః సత్పథాచారః, ప్రాణదః ప్రణవః పణః ॥ 102

ప్రమాణం ప్రాణనిలయః, ప్రాణభృత్ప్రాణజీవనః
తత్త్వం తత్త్వవిదేకాత్మా, జన్మమృత్యుజరాతిగః ॥ 103

భూర్భువఃస్వస్తరుస్తారః, సవితా ప్రపితామహః
యజ్ఞో యజ్ఞపతిర్యజ్వా, యజ్ఞాంగో యజ్ఞవాహనః ॥ 104

యజ్ఞభృద్యజ్ఞకృద్యజ్ఞీ, యజ్ఞభుగ్యజ్ఞసాధనః
యజ్ఞాంతకృద్యజ్ఞగుహ్య, మన్నమన్నాద ఏవ చ ॥ 105

ఆత్మయోనిః స్వయంజాతో, వైఖానః సామగాయనః
దేవకీనందనస్స్రష్టా, క్షితీశః పాపనాశనః ॥ 106

విష్ణుసహస్రనామస్తోత్రము

శ్లో॥ శంఖభృన్నందకీ చక్రీ, శార్ఙ్గధన్వా గదాధరః
రథాంగపాణిరక్షోభ్యః, సర్వప్రహరణాయుధః ॥107
వనమాలీ గదీ శార్ఙ్గీ, శంఖీ చక్రీ చ నందకీ
శ్రీమన్నారాయణో విష్ణుర్వాసుదేవోఽభిరక్షతు ॥108
శ్రీ వాసుదేవోఽభిరక్షతు ఓం నమ ఇతి.

పాఠకమహాశయులారా ప్రకాశముఖ్యార్థ
కంబుగా విన్నవించునదేమనఁగా విష్ణుసహస్రనామ
స్తోత్రమిదివఱకు జగత్ప్రసిద్ధమై యశేషదేవతా
సహస్రనామస్తవంబుల నతిశయించి శ్రద్ధాభక్తులతోఁ
పఠించువారికి భుక్తిముక్తిదాయకంబై తనరారుచున్నది
మూలగ్రంథములలోని భావము సామాన్యజనులకు గోచరిం
పదు శంకరభాష్యము టీకాతాత్పర్యముతో ముద్రింపఁబ
డియున్నదికాని యది దేవబ్రహ్మైక్యవాదముతోఁ గూడి
యుండుటచేన ద్వైతులకు మాత్రముపయోగకరమై ద్వై
తులను భక్తులను నిరుపయోగమై స్వరూపవిరుద్ధమైయు
న్నదియు దృప్తికొఱంత నివారింపఁబూని శ్రీరంగనివాసుండు
నువైష్ణవసార్వభౌముఁడును నగు పరాశరభట్టరువా
రు సహస్రనామంబులకు విశదముగా భాష్యము
రచించిరి జనసామాన్యంబునకది దురవగాహం
బుగానుండునని యెంచి గ్రంథవిస్తరభీతిచే
నామూలాగ్రముఁ దెలిఁగింపక భాష్యములోని వి
శేషార్థంబులు గనఁబరచుచు మూలతాత్పర్యం
బులిఖించి యీగ్రంథములోఁ జేర్చితిని యీభాష్యకా
రుండగు భట్టరువారు కూరత్తాళ్వారి కుమారుఁడు వ్యా
సభట్టరాచార్యునకగ్రజుఁడు ఎంబారులవారి శిష్యుఁడు

విజ్ఞాపనము

రామానుజులవారికి నంతరంగభక్తుఁడు సమస్తవేదవే
దాంతపారంగతుఁడు విద్వత్సార్వభౌముఁడగు వేదాం
తితో వాదించి జయించి యద్వైతరుచిమానిచి రామా
నుజసిద్ధాంతంబు నెలకొలిపిన బ్రహ్మవేత్త ఇమ్మ
హాత్ముని శిష్యుఁడైన పెమ్మటి వేదాంతియు తాశ్రమ
మును స్వీకరించి లక్షల ద్రవ్యము గురునకు సమర్పించి
నంజీయరను ద్రావిడనామంబు గాంచి ద్రావిడవే
దంబులకు మణిప్రవాళవ్యాఖ్యానంబు నొనరించి భ
గవద్విషయంబను దివ్యప్రబంధంబును నిర్మాణించి
చిరకాలంబు శ్రీరంగంబున వసించి వైష్ణవ
సిద్ధాంతరాజ్యమును బాలించి బద్ధచేతనుల నుద్ధ
రించెనిది యిట్లుండఁగా భట్టరువారు శ్రీరంగరాజ
స్వామిం గూర్చి పూర్వశతకమనియును ఉత్తరశతకమ
నియును రెండు గ్రంథంబులు గీర్వాణభాషలో రచించె నింతే కా
క యింకననేక గ్రంథంబులు నిర్మాణించె నీసూరివర్యుని
ప్రబంధంబులన్నియును జ్ఞానభక్తివైరాగ్యదాయకంబులై భ
గవత్స్వభావప్రతిపాదకంబులై నారికేళపాకంబుతో విల
సిల్లుచుండు వెండియు నియ్యాచార్యవర్యుండు జీవితకాలం
బులో భవ్యతరాంబరాభరణభూషితుండై ప్రేమములను
మహాభోగివలెఁ గన్పట్టుచుండెను, కాని శ్రీరంగరాజవ
రప్రసాదజనితుండగుటవలన మహావిరాగి. యట్టి భక్తుఁజు

విజ్ఞాపనము

క్రోశ ఏవ । తాన్మే క్రోశం కిం కస్మాత్ శితాం విషమమువిదితం క్షేత్ర
త్రసాక్షి సుధీస్వా । త్వం తత్వాత్త్వక్షు పాతి సజ్జాతి స్వకలపో
మృగ్య మఖస్త వ త్వ్వోమ్ః

ఈ శ్లోకము భగవంతునకు జీవునకు సంవాదముగా
నున్నదియెట్లంటే రేని.

భగవంతుడొకానొక జీవుని(గూర్చి)యడుగుచున్నాడు.
ఓరి జీవు(డా) నీవు నావా(డవు), జీవు(డిట్లనియు)నాదుని
ను నావా(డనే) భగ॥ అదియెట్లు॥ జీవు(డు) నేను నీవా(డన
గుటయెట్లు॥ భగ॥ వేదాదియూల ప్రమాణములవల్ల)
జీ॥ అనాదిసిద్ధమైన యనుభవము వలననే నేను నావా(డనై
తిని॥ భగ॥ ఆయనుభవము స్థిరమైనదికాదు ప్రవిదావిగత
మైయేయున్నది॥ నేను నీవా(డనైనచో నన్నెప్పుడు నవు మం
దలించవేది) భగ॥ శిలా... శాస్త్రము చేసిన సంగతి నేటిం
నించియున్నాను॥ నీవు నాకు(తెలిపితివనుటకు సాక్షియె
వరు॥ భగ॥ జ్ఞానియైన పండితు(డు) జీ) డివాయతం
డునకు(బ్రహ్మపాతిసారూప్యము పునకాన(బడదు'గ్రాట్లు జే
వేశ్వరులు వివాదముంద(గా జీవునకు సమాధానము
సెప్పలేక భగవంతు(డు తడబడి కట్టు కాని ప్రమాణము
చేయుచున్నాడా యేమి మనుకట్టి వైఖరితోను నాడు అని భట్టు

## విజ్ఞాపనము

దువారు శ్లోకము పూరింపఁగా రామానుజులవారు
మసన్నిధినావ్రములునుఁ బరమాశ్చర్యభరితాంతఃకర
ణులైరి అట్టి ప్రభావసంపన్నులగు పరాశరభట్టు
రువారిచే రచింపఁబడిన విష్ణుసహస్రనామభాష్య
మును శక్తికొలఁది తెలిగించి సందులకు నా సాహసం
బును మన్నింతురని పండితులకుఁ గవులకు సాష్టాం
గనమస్కృతులాచరించెదను

ఇట్లు శ్రీవైష్ణవపాదరేణువు ముప్పవేం
కటదాసు

శ్రీమతే రామానుజాయ నమః

శ్రియై నమః

శ్రీధరాయ నమః

శ్రీ పరాశరభట్టారాచార్యకృత విష్ణుసహస్రనామభా
ష్యాంధ్రతాత్పర్యము.

1 విశ్వం) విశత్యవయవాన్ = అణువులయందు (కూడ వ్యా
పించి పరిపూర్ణుడైనవాడు

2 విష్ణుః) స్వవిభూతిభూతం, చిదచిదాత్మకం సర్వం విశతీతి =
తన విభూతియగు చిదచిత్తులయందు ప్రవేశించిన
వాడు

3 వషట్కారః) సర్వం వశం స్వేచ్ఛాను వర్తం కరోతీతి) సమస్త
ము తనవశము చేసుకొనువాడు

4) భూతభవ్యభవత్ప్రభుః = కాలత్రయవర్తినాం ప్రభుః = మూండు కా
లముల యందుండువారికి ప్రభువు

5) భూతకృత్ = సర్వాణి భూతాని స్వతంత్రః సృజతీతి = సర్వభూ
తములను స్వతంత్రుడై సృష్టించువాడు

6) భూతభృత్ = భూతాని బిభర్తీతి) భూతకోటిని భరించు
వాడు

7) భావః) ఉక్త వక్ష్యమాణ సర్వవిభూతిభిః నటవత్ప్ర

విష్ణు సహస్రనామ భాష్యము (ప్రథమ శతకము 2

చాలకేన విశిష్టతయా భవతీతి) పెంచుటతో (గూడినసేమలి వేలవిభూతులతో (గూడియుండువాడు

8) భూతాత్మా) సర్వేషాం భూతానామాత్మా) సమస్త భూతములకునాత్మయైనవాడు

9) భూతభావనః) భూతాని ధారకపోషకభోగ్యప్రదానేన వర్ధయతీతి) ధారకపోషకభోగ్యవస్తువులనిచ్చి భూతములనరక్షించువాడు

10) పూతాత్మా) ఆత్మత్వేపి సంసారివత్ శరీరభూతచిదచిద్దోషానస్పృష్టాత్మా) భూతములయందువ్యాపించియున్నను జీవునివలె శరీరభూతములైన చిదచిత్తుల దోషములనంటక పవిత్రు(డైయుండువాడు

11) పరమాత్మా) పరోమాఽస్యేతి పరమస్సచ ఆత్మా) ఎవనికంటె శ్రేష్ఠు(డులేడో వా(డు పరము(డు) అట్టి భూతములకన్నిటికినాత్మయైనవా(డు

12) ముక్తానాం పరమాగతిః) ప్రకృతిబంధము) అవిద్యా, కర్మసంస్కారము మొదలగునావరణములనుండి విడువ(బడిన ముక్తులకు(బ్రాప్యమైనవా(డు

13) అవ్యయః) న వ్యయతే నవ్యపగమ్యతే అస్మాదితి) ముక్తులెవ్వటికిని వీనిచే విడువ(బడరు

14) పురుషః = పురు బహు సనోతి ఇతి = ముముక్షులకు (దన గుణానుభ
వము మిక్కుటముగా నిచ్చువాడు.

15) సాక్షీ = ముక్తానాం ఆనంద యక్ష స్వయమపి ప్రత్యక్షేణ సాక్షాత్ ఈక్షతే
ఇతి) ముక్తులనానందపరిపూర్ణ స్వయముగా (ప్ర)త్యక్ష
ముగా (జూచుచుండువాడు

16) క్షేత్రజ్ఞః = ముక్తానాం స్వానుభవం జానాతి తదేవాంతం జానా
తి ఇతి) ముక్తులకు స్వానుభవమిచ్చుటకు సుక్షేత్రస్థానము
గు పరమాకాశము నెఱింగినవాడు

17) అక్షరః = ముక్తైః స్వదానుభూయమానోపి మహాత్మ్యవ
శిష్టస్వగుణైః స్వేజ్ఞ నేన ఉపర్యుపరి భోగ్యతయా వ
ర్ధయతే, న తు క్షరతి ఇత్యక్షరః) ముక్తులచే నెల్లప్పు
డనుభవింపబడినను మధు(ప్ర)వాహము వలె నిరవధి
కములైన గుణములయందు ముంచి యంతకంతకు భోగ్యు
డై పెరుగుచు (దఱుగని వాడు

18) యోగః = యుజ్యతే ప్రాప్యతే అనేన ఇతి, వీనిచే తానే ము
క్తి (బొందబడుచున్నది

19) యోగవిదాంనేతా = వ్యవహితోపాయనిష్ఠానామపి నేతా
వ్యవహితములైన యుపాయములందున్న యోగవిదులకును
సుఫలము గలిగించి యుద్ధరించువాడు

20) ప్రధానపురుషేశ్వరః, ప్రధానస్య బంధహేతోః పురుషాణాం చేశ్వరః, బంధహేతువైన ప్రకృతికిని పురుషులకును నియామకుఁడైనవాఁడు

21) నారసింహవపుః, భక్తభయాపహా, తదపేక్షా సమృద్ధి ప్రతిపన్న [struck out] యథాకామ దివ్యమహానృసింహాసంహననః, భక్తుఁడైన ప్రహ్లాదుని భయమును బోఁగొట్టునదియు, నతఁడు కోరినట్లు ధరింపఁబడినదియు యథేష్టమునైన నృసింహ శరీరము గలవాఁడు

22) శ్రీమాన్, పరస్పర దుర్ఘటాపూర్వ వికృతరూపవపుః ధారేపి శ్రీమాన్ పరస్పరము దుర్ఘటమైన, యట్టి నృసింహత్వముల కలయిక గల వికృతరూపమును ధరించినను సౌందర్యలావణ్యాదులచే మనోహరుఁడైనవాఁడు

23) కేశవః, ప్రశస్త స్నిగ్ధ నీలకుటిల కుంతలః, నలుపు, వంకర, నునుపు గలిగి ప్రశస్తములై యుండు వెండ్రుకలు గలవాఁడు.

24) పురుషోత్తమః, పురుషేభ్యః, ఉత్తమః, జీవులందఱికంటె నుత్తముఁడైనవాఁడు

25) సర్వః, సర్వం సమాప్నోతీతి, అంతట వ్యాపించినవాఁడు

26) శర్వః, స్వశరణభూతానామశుభమపి [illegible] కరోతీతి, స్వశరణభూతులైన జీవుల యశుభములను బోఁగొట్టువాఁడు

27) శివః, శుభావహత్వాచ్ఛివః, శుభములుగలిగించువాఁ
డు

28) స్థాణుః, శుభములుగలిగించుటయందు స్థిరుఁడైనవాఁడు

29) భూతాదిః, భూతైరుపాదీయత ఇతి, స్వలాభేచ్ఛయుఁడ
నుటచే భూతములచే గ్రహింపఁబడువాఁడు

30) నిధిరవ్యయః, నిధి వలెననుభవింపఁబడియుఁ దఱుగ
నివాఁడు

31) సంభవః, సమంతాత్ భవో యస్యేతి, సర్వదేశకాల
ములయందు రామకృష్ణాద్యవతారములుగలవా
డు

32) భావనః, ఉజ్జీవయతీతి, అనిష్టనివారణాదులచేను
జ్జీవింపఁజేయువాఁడు

33) ~~భర్తా~~, తానాత్మదానేన, తచ్ఛీలః పుష్ణాతీతి, ఆత్మదా
నముచేఁదనవారిని రక్షించువాఁడు

34) ప్రభవః, అయమస్య భవః ప్రకృష్ట ఇతి, శ్రేష్ఠమైనజ
న్మముగలవాఁడు

35) ప్రభుః, ప్రభవతీతి, ఇతరదేవతలకసాధ్యమైనయ
పవర్గాదులిచ్చువాఁడు

36) ఈశ్వరః, పారమేష్ఠ్యేఽపి జన్మనస్వాధీనతమప్రయోజ

విష్ణుసహస్రనామభాష్యమ్, ప్రథమశతకమ్

నైశ్వర్యస్యేతి, అవతారములయందు సర్వబ్రహ్మకంటె
మిగిలినట్టైశ్వర్యము గలవాఁడు

37) స్వయంభూః, లోకార్థం స్వయం భవతీతి, లోకకొఱకు
స్వేచ్ఛగా జనించువాఁడు

38) శంభుః, శం సుఖం భావయతీతి, సౌందర్యాదులనా
విస్తరించి సుఖమును బొందించువాఁడు

39) ఆదిత్యః, ఆదిత్యేఽస్యనివాసత్వాత్, సూర్యుఁడే నివాస
స్థానముగాఁగలవాఁడు

40) పుష్కరాక్షః, పుండరీకే వాక్షిణీ యస్యేతి, పుండరీకము
లవంటి నేత్రములుగలవాఁడు

41) మహాస్వనః, మహాన్ పూజ్యః, స్వనశ్శబ్దో యస్యేతి,
పూజ్యమైన శబ్దముగలవాఁడు)

42) అనాదినిధనః, నిత్యయౌవనతయా, జనిజరాదిదురి
తేదూరవిగ్రహః, జన్మజరాదివికల్పములేని నిత్యయౌ
వనవిగ్రహముగలవాఁడు

43) ధాతా, అనిరుద్ధస్వరూపః, అచిత్సమష్టిభూతా
యాం ప్రకృతౌ చిత్సమష్టిభూతం విరించాత్మకం,
గర్భం దధాతీతి, అనిరుద్ధరూపుఁడై అచిత్స్వరూప

మైన ప్రకృతియందు చేతనాత్మకమై విరించాత్మకమగు గర్భమును బో[షించినవాడు] 7

44) విధాతా - తం గర్భం పరిణామయన్ ఆవిర్భావయతీతి - ఆ గర్భమును పరిపక్వమొనర్చి యావిష్కరించినవాడు

45) ధాతురుత్తమః - తత్సలష్టభ్యః ప్రజాపతిభ్యః ఉత్తమః - తనచేత సృజింపబడిన ప్రజాపతులకంటె గొప్పవాడు

46) అప్రమేయః - తేషాం కరణైః ప్రమాతుమశక్యః - బ్రహ్మాదులవారి జ్ఞానములకునందనివాడు

47) హృషీకేశః - హృషీకాణామీశః - బ్రహ్మాదుల యింద్రియములకు ప్రభువైనవాడు

48) పద్మనాభః - పద్మం నాభావస్యేతి - బ్రహ్మకు గారణమైన పద్మము నాభియందు గలవాడు

49) అమరప్రభుః - అమరాణాం సృష్ట్యధికారదానేన ప్రభుః - దేవతలకు సృష్ట్యధికారములనిచ్చు ప్రభువు

50) విశ్వకర్మా - విశ్వం కర్మ అస్యేతి - బ్రహ్మాదులమొదలు [?] గల సమస్త జగద్వ్యాపారము సేయువాడు

51) మనుః - మననాదేవ జగత్సృజతీతి - సంకల్పమాత్రముచేతనే జగత్తును సృష్టించువాడు

52) త్వష్టా: నిర్మితం జగత్ సురనరాదివైచిత్ర్యవిభక్తం త్వ
క్షతి; తనచే నిర్మింపబడిన జగత్తును సుర
నరాదినామరూపములచే స్పష్టము సేయువాడు

53) స్థవిష్ఠ: స్థూలతమ: చతుర్దశభువనరూపమైన
స్థూలజగత్తు ఆవరకముగా గలిగి స్థూలతముడై
నవాడు

54) స్థవిర: తిష్ఠతీతి కాలమునకు వశుడుగాక కాలా
ములను దనవశమందుం[redacted]చుకొన్నవాడు

55) ధ్రువ: అనంతపరిణామాదప్[redacted]వికారాత్ తయా
స్వరూపాదప్రచ్యావ్య: జగద్రూపమైన ప
రిణామమందియు వికారములేక తనస్వరూప
మునుండి తప్పించు[redacted]టకువలుగానివాడు

56) అగ్రాహ్య: మృత్తంత్వాదిరివ కులాలకువిందా
దినానధిష్ఠేయ: మృత్తుతంతువులవలెం
గులాలకువిందాదులచే నధిష్ఠింపబడనివాడు

57) శాశ్వత: అనవరతజగద్వ్యాపారప్రవాహాత్మ
నా నిత్య: జగద్వ్యాపారప్రవాహరూపము
గా నిత్యుడైనవాడు

విష్ణు సహస్రనామ భాష్యమ్ ప్రథమశతకమ్ 9

58) కృష్ణః) లీలారసననితాంతనిర్వృతః) లీలారసము
చే మిగులనానందపడువాఁడు

59) లోహితాక్షః) ఆనందసూచకములై యెఱ్ఱతామర
లవంటిలోచనములుగలవాఁడు

60) ప్రతర్దనః) ప్రకృష్టేన తర్దయతీతి) మరలజగముల
నన్నిటినిసంహరించువాఁడు

61) ప్రభూతః) సర్వసంహారేఽపి ప్రభూతః సమృద్ధః)
అన్నియునశించినప్పుడుకూడ సమృద్ధుఁడైనవాఁడు

62) త్రికకుద్ధామా) త్రికకుత్ త్రిపాద్విభూతిలక్షణం
పరంధామ యస్యసః) త్రిపాద్విభూతియనివాసము
గాఁగలవాఁడు)

63) పవిత్రం) పవిత్రుఁడైనవాఁడు

64) మంగళంపరం) స్వయంప్రభానందతయా కల్యాణతమ
త్వాత్ ॥ అనంతానందరూపుఁడై కల్యాణైకతానుఁడై
నవాఁడు

65) ఈశానః) సర్వావస్థస్య పరవస్తు స్వరూపస్వభా-
వ నియన్తా) తనకంటెనితరములైనవస్తువులను సర్వావస్థలయం

ధునియమించు స్వభావము గలవాఁడు

66) ప్రాణదః । ప్రాణం దదాతీతి తన దర్శనమూపానుభవము నకు యోగ్యమైన బలము నిచ్చువాఁడు

67) ప్రాణః । ఉజ్జీవనహేతుత్వే । జ్ఞానులకుజ్జీవనహేతువైనవాఁడు

68) జ్యేష్ఠః । స్వేన సూరిభిశ్చ సర్వదా సర్వథానుభూతేఽపి అదృష్టపారమపరవిభూతిత్వేన ప్రశస్తతమః । తన చేతను సూరులచేతనుఁ బూర్తిగా నెల్లప్పుడనుభవింపఁబడినను దఱుగని విభూతిచేఁ బ్రశస్తతముఁడైన వాఁడు

69) శ్రేష్ఠః । తైస్స్వదానుభవప్రీతైః స్తోత్రైః పరిచర్యమాణః । జ్ఞానులయొక్క స్తోత్రములచేఁ బరిచరింపఁబడువాఁడు

70) ప్రజాపతిః । బద్ధముక్తేభ్యః ప్రకృష్టతయా జాయతే భవతీతి ప్రజాః సూరయః, తేషాం పతిః । బద్ధముక్తులకంటె శ్రేష్ఠులగుచున్నారుగాన ప్రజలనఁగా నిత్యసూరులు వారికిఁ బ్రభువు

71) హిరణ్యగర్భః, హిరణ్మయమైన పరమాకాశమునకు గర్భభూతుఁడై అనఁగా దానియందు నివసించువాఁడు

72- భూగర్భః) భూః) భూమిః) సదానుభవేన భరణీయా గర్భభూతాస్సంతి) సదానుభవముచేత భరణీయమై గర్భభూతమైన భూదేవిగలవాడు

73) మాధవః) మాయాః శ్రియః ధవః) లక్ష్మీపతియైనవాడు

74) మధుసూదనః) సర్వనిర్వాహకు(డై రాక్షసనాశనముచేసి ప్రతిహతలక్ష్మీకు(డైనవాడు

75) ఈశ్వరః) అపర్యాప్తపరభోగభూమావప్రతిహతేస్వేచ్ఛః) అపారమైన పరమానందమునందును ప్రతిహతముకాని స్వేచ్ఛగలవాడు

76) విక్రమీ) సంకల్పాదన్యథా ప్రసక్తికి విరోధియగు విక్రమముగలవాడు

77) ధన్వీ) దివ్యంశార్ఙ్గ ధనుర్నిత్యమస్యాస్తి, నిత్యమును శార్ఙ్గమను దివ్యచాపమును ధరించినవాడు

78) మేధావీ) సహజసార్వజ్ఞః) సహజముగా సర్వజ్ఞు(డు

79) విక్రమః) వినాపతంగపతినా క్రమణం) తత్ర తత్ర స్వేచ్ఛయా) విహారగతాగతమస్యాస్తి వి: యన(గా వేదమయు

డైనగరుడుడు, వానిపైనెక్కి స్వేచ్ఛగా విహారముచేయు వాఁడు

80) క్రమః, నిత్యవిభూతిచే సమృద్ధుఁడైనవాఁడు

81) అనుత్తమః, తనకంటె నుత్తముఁడు లేనివాఁడు

82) దురాధర్షః, గాంభీర్యాతిశయేన, అంభోధివద నభిభవనీయః, గాంభీర్యాతిశయముచే సముద్రమువలెఁ దిరస్కరింపరానివాఁడు

83) కృతజ్ఞః, సంసారిణామానుకూల్యలవం జానాతి, అవిద్యావరణముచేఁగప్పఁబడ్డ స్వమును మఱచి మత్తులైయుండు బద్ధులు తనయందొనర్చిన యానుకూల్యలేశమును గుర్తించువాఁడు

84) కృతిః, తచ్ఛ్రుతేషాం సుకృతమనాల్పదేవప్రసన్నాదితి, ఆయానుకూల్యలేశము ప్రసన్నుఁడైనవానివలననే కలుగును

85) ఆత్మవాన్, తస్యకర్తృరోపాత్తాత్మనః, తదాయత్తస్వరూపప్రవృత్త్యాదికతయాఽస్య స్వభూతాఇతి, ఆత్మలు తనకధీనమైనప్రవృత్తిగలవిగాను తనసొమ్ముగాను గలవాఁడు

86) సురేశః) ఫల్గుప్రదత్విషూనాం బ్రవర్తితానామపి సంవిధాతా) అల్పప్రదవులు వాంఛించు ప్రవర్తిదులకవిచ్చే కూర్చువాఁడు

87) శరణం) అవిశేషేణ సర్వేషాం శరణం) సర్వులకు సవిశేషముగా రక్షకుఁడైనవాఁడు

88) శర్మ) శర్మసుఖం పరమప్రాప్యం చేతి) పరమప్రాప్యమైన సుఖరూపుడు

89) విశ్వరేతాః) విశ్వం రేతః అస్యేతి) సర్వము వానిచేఁ జేయఁబడుచున్నది

90) ప్రజాభవాః) సర్వాః ప్రజాః తత్కర్తృకైరేవోపకరణైః క్లైప్తస్సిద్ధ భవంతి) సర్వప్రజలు వానిచేత ఏర్పఁబడిన యుపకరణములచేతనే వానియందాభిముఖ్యమునొందియున్నారు.

91) అహః) నహీనోఽస్యాస్తీతి) హీనములేనివాఁడు

92) సంవత్సరః) ప్రబుద్ధేషు సముద్ధరణాయ సంవస్తీతి) జ్ఞానమెఱింగినవారిను ద్ధరించుటకై వారియందుండువాఁడు

93) వ్యాళః) ప్రస్థానేన తాన్ ఆత్మసాత్కరోతీతి) జ్ఞానులకెదురుగాఁబోయి తనయందుఁ జేర్చుకొనువాఁడు

94 ప్రత్యయః) ప్రతీయతే౽స్మిన్నితి) భక్తులకితనియందు విశ్వాసముగలుగుచున్నది)

95) సర్వదర్శనః) తేషాం సర్వం స్వమహిమానం దర్శయతీతి) భక్తులకుఁదనమహిమనంతయుఁజూపువాఁడు

96) అజః) తేషాం స్వప్రాప్తిపరిపంథి[సర్వా]న్యజతీతి) భక్తులకు దనప్రాప్తివిరోధులను నశింపఁజేయువాఁడు

97) సర్వేశ్వరః) సమర్థానామసమర్థానాం సర్వేషాం శరణాగతానాం వైలంబ్యం పరిహర్తుమాశ్రితానీష్టే ఇతి) సమర్థాసమర్థులైన శరణాగతులనందఱిని రక్షించుటకు విలంబనము లేకవచ్చువాఁడు

98) సిద్ధః) తేషాం స్వరూపేణ సిద్ధః) అన్యోపాయములచే సాధ్యుఁడుగాక స్వరూపముచేతనే భక్తులకు సిద్ధుఁడైనవాఁడు

99) సిద్ధిః) ఉపాయైరప్యయమేవ సాధ్యత ఇతి) ఉపాయములచేఁగూడ సిద్ధింపఁబడు వస్తువితఁడే యగువాఁడు

100) సర్వాదిః) తేషాం పరావరసర్వపురుషార్థమూలమితి) భక్తులకుఁబరావరరూపసర్వవిధపురుషార్థ

ములను (గారణమైనవాడు

ప్రథమశతకము సంపూర్ణము

ద్వితీయశతకప్రారంభః

101) అచ్యుతః। తేభ్యః ప్రపన్నేభ్యః నాపగతః। ప్రపన్నులను విడువనివాడు

102) వృషాకపిః। ధర్మశ్రేష్ఠుడైనవాడు

103) అమేయాత్మా। ఇయానిత్యపరిచ్ఛేద్యస్వరూపః। ఇంతవాడని పరిచ్ఛేదింపరాని స్వభావముగలవాడు

104) సర్వయోగవినిస్సృతః। వేదశాస్త్రములచేత (బొందుటకు యోగ్యుడైనవాడు

105) వసుః। తేష్వతి ప్రత్యావసతీతి। ప్రపన్నులయందు మిక్కుటమైన ప్రీతిగలవాడు

106) వసుమనాః। వసునిధావివ తేషు మనోఽస్యేతి। నిధియందువలె భక్తులయందెప్పుడు మనస్సునుంచువాడు

107) సత్యః। తేషు సత్సు సాధురితి। సత్పురుషులయందు సాధువైయుండువాడు

108) సమాత్మా। తేషు గుణాదిభిర్నిమ్నోన్నతేష్వప్యసా

లోచిత
~~చిత్త~~ విశేషమనాః ) గుణాములచే (దనభక్తులయందెచ్చుతా
చ్చులుండినను వానిని విచారింపకసమముగా (జూచువా
(డు —

109) సమ్మితః ) తైరస్మాథ స్తస్థ ఇతి సమ్యక్ స్వీకృతః -
భక్తులచే దమవాస్తవతు (డైయభిను (డుగా భావింప
బడువా(డు

110) సమః ) తేష్వపి గౌరవేణ సమ ఇతి ) అట్టివారియందు స
మమైన గౌరవము గలవా(డు

111) అమోఘః ) తేషామవితథస్వరూపః ) వారియెడ
వ్యర్థముగాని సంబంధము గలవా(డు

112) పుండరీకాక్షః ) పుండరీకం పరంధామ ) తస్మిన్
వాసినాం దృష్టిభూతః ) పుండరీకమనగా
వైకుంఠము, అచ్చటు వసించువారికి దృష్టిభూ
తు(డు

113) వృషకర్మా ) ఏవం ప్రకృష్ట సర్వ ప్రస్థాదినామ
పిశ్రేయస్కరత్వాత్ ధర్మరూపమస్యకర్మేతి )
గొప్పవా(డైనను నీచులమైన మనయందు శ్రేయస్కరు(డై
ధర్మరూపమైన కర్మము నాచరించువా(డు

114) వృషాకృతిః) తథాకృతిరస్యేతి) ధర్మయుక్తమైనరూపము గలవాఁడు

115) రుద్రః) ఏవంవిధరూపవివిధచేష్టితశ్రుతవ్యతయాన సానందబాష్పాన్ కుర్వన్ రోదయతీతి) ఇట్టిరూపక్రియలచే ద్రవించినమనస్సుగలవారినానందబాష్పయుక్తులుగాఁజేయుచునేడ్పించువాఁడు

116) బహుశిరాః) బహూనిశిరాంసి అస్యేతి) అనేకశిరస్సులుగలవాఁడు

117) బభ్రుః) తథావిధస్సన్ బిభర్తీతి) అట్టిశిరస్సులచే భూమినిభరించువాఁడు

118) విశ్వయోనిః) విశ్వేషాం భజుషాం స్వేనమిశ్రయతేతి) భజించువారినందఱినిఁ దనతోఁగలుపుకొనువాఁడు

119) శుచిశ్రవాః) తదుక్తాన్నవశ్శంశ్రృణోతీతి) భక్తులచేఁజెప్పఁబడునవియువశ్యము వినువాఁడు

120) అమృతః) తేషాం నిరవధికమాధుర్యకామసదాసేవాయామప్యతృప్తికరత్వేన) వారుసదాసేవించినను తృప్తిజనింపనంతమాధుర్యము గలవాఁడు

121) శాశ్వతస్థాణుః స్థాయం నిత్యేన భోక్తృభావేన హరిః శాశ్వతః, స్వయముగా నిత్యుఁడై భోక్తలకు దలుఁగనివాఁడు

122) వరారోహః, వరం, ఉత్కృష్టమారోహణం స్వప్రాప్తిరస్యేతి, శ్రేష్ఠమైన తనప్రాప్తిగలవాఁడు

123) మహాతపాః, మహత్తపః జ్ఞానమస్యేతి, పూజ్యమైన జ్ఞానముగలవాఁడు

124) సర్వగః, బలేనాత్మవద్ధారయన్ సంహృతాన్ సర్వాన్ గచ్ఛతీతి, బలముచే ధరించి సంహరింపఁబడిన సర్వలోకములనుఁ బొందువాఁడు

125) సర్వవిత్, సంహృతాన్ సిసృక్షుః సర్వాన్ విందతీతి సృష్ట్యై లభత ఇతి, సంహరింపఁబడిన లోకములను సృష్టిచే మరలఁ బొందువాఁడు

126) భానుః, సర్వనిర్వాణోప్యవికుర్వాణో భాతీతి, సర్వమును నిర్మించియు, వికారము లేక భాసించువాఁడు,

127) విష్వక్సేనః, అనేన సహావర్తత ఇతి సేనా అనేన రక్షకేనాంతో జంతవో విష్వంచో స్యేతి, తానే రక్షకుఁడుగాఁగల జంతుకోటియంతటను గలవాఁడు

128) జనార్దనః, దస్యూన్ ప్రతిపక్షాన్ జనాన్ అనపేక్ష్యాఽర్దయతీతి, దస్యులనదుష్టులైన జనులను హింసింపఁజేయువాఁడు

129) వేదః, వేదములను బ్రహ్మకిచ్చినవాఁడు

130) వేదవిత్, వేదార్థం చాపి విశేషయ వివరాన్ సంవేత్తీతి, వేదార్థమును నిస్సందేహముగా నెఱిఁగినవాఁడు

131) అవ్యఙ్గః, తదంగైశ్ఛందః కల్పాదిభిరవిహీనః, వేదాంగములను సహా యెఱింగినవాఁడు

132) వేదాంగః, వేదాస్త్వనంతశాఖా అస్యాంగశరీరమితి, వేదమే శరీరముగాఁ గలవాఁడు

133) వేదవిత్, వేదాన్ తదర్థానుష్ఠానేన విందతీతి, వేదార్థమును అనుష్ఠించువాఁడు

134) కవిః, క్రాంతదర్శిత్వాత్, భూతకాలము నెఱింగినవాఁడు

135) లోకాధ్యక్షః, ఆరాధించు లోకులను రక్షించువాఁడు

136) సురాధ్యక్షః, ఆరాధించు దేవతలను రక్షించువాఁడు

137) ధర్మాధ్యక్షః, ధర్మమును చెడకుండ రక్షించువాఁడు

138) కృతాకృతః, సంసారప్రవర్తన నివర్తనరూపమైన ధర్మము రూపముగాఁ గలవాఁడు

139) చతురాత్మా, వాసుదేవసంకర్షణప్రద్యుమ్నానిరుద్ధులనెడు నాలుగు రూపములుగలవాఁడు

140) చతుర్వ్యూహః, చతుర్వ్యూహములతో నాలుగువిధములుగానుండువాఁడు

141) చతుర్దంష్ట్రః, పూర్వావతారాలేన పరరూపాపేక్షా చతుర్దంష్ట్రః, పూర్వవంశాలమైనతర స్వరూపమునందు నాలుగు దంష్ట్రలుగలవాఁడు

142) చతుర్భుజః, నాలుగు భుజములుగలవాఁడు

143) భ్రాజిష్ణుః, పైఁజెప్పిన చతుర్భుజములతో ప్రకాశించువాఁడు

144) భోజనం, భుజ్యతే సుఖేనానుభూయత ఇతి దాసులచే సుఖముగా ననుభవింపఁబడువాఁడు

145) భోక్తా, స్వయమర్పితదత్తస్య భోక్తా, స్వయముగాఁ దానువారిచే నర్పింపఁబడినవానిననుభవించువాఁడు

146) సహిష్ణుః, తేషామభిమతాస్థిరవధారాపరాధాన సహిష్ణుః, భక్తులయభిమతమున సానందించి వారిచేఁ జేయఁబడిన యపచారములను సహించువాఁడు

147) జగదాదిజః॥ జగదాదిభూతాసు త్రిమూర్తిష్వున్నతమత్వేన జాయత ఇతి। జగత్కారణభూతులైన త్రిమూర్తులయందున్నతమూర్తిగానుండువాఁడు

148) అనఘః॥ ఏవం సంసారమధ్యే జనిత్వాప్యనఘః॥ ప్రకృతియందుద్భవించియుఁ బాపములంటనివాఁడు

149) విజయః॥ మూర్త్యంతరయోరపి సృష్టిసంహారాదిభిర్జగద్విజయోఽస్యాస్తీతి। మూర్త్యంతరములైన శివబ్రహ్మాదులకు సర్వజగద్విజయమితనివల్లఁ గలుగును

150) జేతా॥ తయోరపి జేతా। వారిద్దఱిని దనయాజ్ఞయందుంచువాఁడు

151) విశ్వయోనిః॥ విశ్వస్య కార్యప్రపంచస్య కారణం। శివబ్రహ్మాదుల ద్వారా కార్యప్రపంచమునకుఁ గారణమైనవాఁడు

152) పునర్వసుః॥ పునర్దేహేష్వంతరాత్మతయా వసతీతి। మరల నా బ్రహ్మాదులయందంతరాత్మయై వసించువాఁడు

153) ఉపేంద్రః) అనుజత్వేనేంద్రముపగతః) ఇంద్రునకుఁ
దమ్ముఁడైనవాఁడు

154) వామనః) భ్రష్టాన్ స్వకాంత్యా వామాని సుఖాని న
యతీతి) చూచువారికిఁ దనకాంతిచే సుఖము
నుఁ గూర్చువాఁడు

155) ప్రాంశుః) త్రివిక్రమరూపియైనవాఁడు

156) అమోఘః) నాస్య వ్యర్థాస్తి) వ్యర్థమైన దొకటియులే
నివాఁడు

157) శుచిః) ఉపకారము నొనర్చియుఁ బ్రత్యుపకారముగో
రనివాఁడు

158) ఊర్జితః) నముచిప్రభృతిపరిపంథివధబంధనా
త్ బలమూర్జస్సంజాతేతి) నముచి
మొదలుశత్రువుల వధించుటవలనఁ బ్రసిద్ధి
నొందినబలముగలవాఁడు

159) అతీంద్రః) ఇంద్రానుజత్వేప్యైశ్వర్యసంపదాదేన
తమతిక్రాంతః) ఇంద్రునికిఁ దమ్ముఁడైనను నైశ్వర్యముచేతను
వృత్తముచేతనతని నతిక్రమించినవాఁడు

160) సంగ్రహః) భక్తైరయత్నేన సంగృహ్యత ఇతి ప్ర
యత్నము లేకయే భక్తులచేఁ బట్టువడువాఁడు

161) సర్గః) త్రివిక్రమ క్రమణా పాదపద్మన్యాసాత్ భక్తః స్పృష్టో
తే ఇతి) త్రివిక్రమరూపియై భక్తులకు సుప్రాప్యమైన పా
దపద్మము లుగలవాఁడు.
162) ధృతాత్మా) ఏవమాత్మదానేన ధృతా ఆత్మానో యేనేతి
ఆత్మదానముచే ధరింపఁబడిన యాత్మలుగలవాఁడు
163) నియమః) బలిప్రభృతయో నియమ్యంత ఇతి) బలిప్ర
భృతులు తనచే నియమింపఁబడుచున్నారు
164) యమః) సర్వమునకంటకానుకూలముగా నియమిం
చువాఁడు)
165) వేద్యః) ఏవమావిర్భూయ ప్రకటితాత్మీయమ
హిమత్వాత్ వేదితుమ శక్యః) ఇట్లు త్రివిక్రమ
రూపియై తనమహిమను ప్రకటించి యెల్లరకుఁదెలిసి
కొనుటకు యోగ్యుఁడైనవాఁడు
166) వైద్యః) వేదితృభవభంజనం విద్యామర్థేత్ వేద ఇతి)
తన్నెఱింగినవారి భవబంధమును వదలించు విద్యనెఱిం
గినవాఁడు
167) సదాయోగీ) సతతజాగరూకః) నిత్యము మేల్కొ
... రికతోనుండువాఁడు

168) వీరహా) స్వవేదనవిహంతౄన్ హైతుకవీరాన్ హంతీతి) తననెఱుంగక దూషించువారిని నశింపఁజేయువాఁడు

169) మాధవః) స్వవిషయపరవిద్యాప్రవర్తనాత్) మాయ నగా స్వవిషయకపరవిద్య దానిని ప్రవర్తింపఁజేసిన వాఁడు

170) మధుః) లబ్ధవిద్యానాః స్వదమానత్వాత్) జ్ఞానుల చేననుభవింపఁబడువాఁడు)

171) అతీంద్రియః) జ్ఞానోపకరణాన్యతిక్రాంతః) ఇంద్రియములకగోచరుఁడైనవాఁడు

172 మహామాయః) మహతీ అప్రపన్నానిఖిలజనమోహినీ మాయాఽస్యేతి) ప్రపన్నులుకానిసమస్తజనులనుమోహింపఁజేయుగొప్పమాయగలవాఁడు

173) మహోత్సాహః) మహోర్జితోత్సాహః) కర్తృత్వలక్షణమైశ్వర్యమస్యేతి) కర్తృత్వలక్షణమైన మహైశ్వర్యముగలవాఁడు

174) మహాబలః) సహాయానపేక్షకర్త్రంతరవ్యాపారకం మహద్బలమస్యేతి కర్త్రంతరసహాయాపేక్షలేని మహాబలముగలవాఁడు

175) మహాబుద్ధిః) మహత్ జ్ఞానమస్యేతి) మహాజ్ఞానముగలవాఁడు

176) మహావీర్యః) సత్యపి తావద్ వికారలక్షణాం మహాద్భుమ
స్యతి) కారణమున్నను కార్యమైన వికారమును (బొం
దని మహావీర్యము గలవాఁడు

177) మహాశక్తిః) మహతీశక్తిరస్యేతి) గొప్పశక్తి గలవాఁడు

178) మహాద్యుతిః) సర్వకార్యపేక్షకారణా వెలమ్మాకరం
తదనపేక్ష లక్ష్మీకాంచ తేజో మహాదస్యేతి) కారణాత్
మునకితరసహాయమవసరములేని మహాతేజస్సుగల
వాఁడు)

179) అనిర్దేశ్యవపుః) అనుపమాన విగ్రహము గలవాఁడు

శ్రీమాన్) తేదను రూపం యా, దివ్యభూషణసంపదా నిత్యయు
క్తః) దానికనురూపమైన దివ్యభూషణ సమృద్ధితోఁగూ
డినవాఁడు

181) అమేయాత్మా) వివిధగుణరూపానురూపాంభోధి
గంభీరభావః) వివిధగుణరూపములకనుకూలమై
న మహాగాంభీర్యము గలవాఁడు

182) మహాద్రిధృత్) మహాంతమద్రిం దరం మథనే ధృతవాన్
మథనసమయమున మందరాద్రిని ధరించినవాఁడు

183) మహేష్వాసః) మహాక్ ఇషూకా మాసః) మహా
ధనుస్సు గలవాఁడు

184) మహీభర్తా) లవితధరణీభరదాశలాః) భూమిని ధరించి
నవాఁడు

185) శ్రీనివాసః) లక్ష్మికి నివాసస్థానమైనవాడు

186) సతాంగతిః) ప్రశాంత ప్రియంకరః) సాధువులకిష్టములు గూర్చువాడు

187) అనిరుద్ధః) నిరుద్ధతనిరోధ విఘ్నచేష్టితః) అడ్డులేనిదివ్య చేష్టలుగలవాడు

188) సురానందః) ఆపత్సఖత్వేన సురాం ఆనందంత్వసాది తి) ఆపత్సఖుడగుటవలనదేవతలనానందింతుడు)

189 గోవిందః) తద్గవాంస్తుతిగిరాం విందః) ఆదేవతలచే స్తోత్రముచేయబడునుపకారముగలవాడు

190) గోవిదాంపతిః) గావః వేదగిరః తద్విదాం జ్ఞానినాం పతిః వేదవిత్తులను రక్షించువాడు

191) మరీచిః) ప్రకాశితనిర్మలరూపః) ప్రకాశించునిర్మలరూపముగలవాడు)

192) దమనః) శాంతిమంతానికి నేభిః భవతాపం దామ్యతి) శాంతిప్రవాహములచే సంసారతాపమునుడుపువాడు

193) హంసః) మనోహరం హంతితి) మనోహరముగానడచువాడు

194) సుపర్ణః) శోభనమైన ఱెక్కలుగలవాడు

195) భుజగోత్తమః) భుజగానాముత్తమః) అనంతభోగపర్యంకశయనః) ఆదిశేషుఁడు పానుపుగాఁగలవాఁడు

196) హిరణ్యనాభః) బ్రహ్మాండము నాభియందుఁగలవాఁడు

197) సుతపాః) గొప్ప జ్ఞానము గలవాఁడు

198) పద్మనాభః) నాభియందుఁ గమలము గలవాఁడు

199) ప్రజాపతిః) ప్రజానాంపతిః) భూతకోటికి బ్రభువైనవాఁడు

200) అమృత్యుః) మృత్యువిరోధి) మృత్యువునకు మృత్యువైనవాఁడు

ద్వితీయశతకము సంపూర్ణము

తృతీయశతకప్రారంభః

201 సర్వదృక్) సర్వాన్ నియంతుం యథార్థం పశ్యతి) సర్వులను యథార్థముగా నియమింపఁ జూచువాఁడు

202) సింహః) సింహరూపియైనవాఁడు

203) సంధాతా) ఋభుద్విపవిష్వభిషణోభివ సంఘాతా ప్రత్యేయానాం ప్రవర్ధద్రభూతానాం సంశ్లేషయితా) శత్రుద్విపసంహారభయంకరుఁడైనను ప్రవర్ధద్రభూతులను గాఁగిలించుకొనువాఁడు

విష్ణుసహస్రనామభాష్యమ్, తృతీయశతకమ్ 30

204) సంధిమాన్, సంధత్తే స్సంధిర్మత్తో స్యేతి, వారితోనిత్యసంయో
గముగలవాఁడు

205) స్థిరః, తత్సంధానేతదుపచారమూర్ధపాలన్యత్వాత్, వా
రియుపచారములనుగ్రహింపక యుట్టికూడియుం
డువాఁడు

206) అజః, స్తంభసంభవత్వేన ఇతరవన్నజాయత ఇతి, స్తం
బమునఁబుట్టుటవలన నితరులవలెఁబుట్టనివాఁ
డు

207) దుర్మర్షణః, ప్రతిపక్షైర్దుర్ధర్షణం మర్షణమస్యేతి, దుస్త
రమైనకోపముగలవాఁడు

208) శాస్తా, ఏవం సర్వకంటకం సాధుశాస్తేతి, సర్వ
కంటకుఁడైన హిరణ్యకశిపునిశాసించినవాఁడు

209) విశ్రుతాత్మా, సర్వత్ర సర్వైర్విశ్వస్యయేన శ్రుతః సింహ
పదానస్వభావః, అన్నియెడలనందఱిచేతనా
శ్చర్యముగా వినఁబడినసింహాకృతిస్వభావముగలవాఁడు

210) సురారిహా, సురారిం హతవానితి, హిరణ్యకశిపుని
వక్షమునుభేదించిచంపినవాఁడు

211) గురుర్గురుతమః, అశేషవిద్యాపరమాచార్యుఁడు

212) ధామ, సచరాచరజగత్తునకాధారమైనవాఁడు

213) సత్యః ; తత్తత్కాలసమాశ్రితేషు సత్సు సాధుత్వ, ఆయాకా
లములయందాశ్రయించిన మహాత్ములయెడ సాధువైన
వాఁడు

214 సత్యపరాక్రమః ; సత్యోఽకైతవః పరాక్రమోవృత్తిరస్యే
తి ; సత్యమైన పరాక్రమవృత్తి గలవాఁడు

215) నిమిషః ; తద్విరోధిషు నిమిషతి నకటాక్షయతీతి ; ఆశ్రి
తవిరోధులనుఁ గటాక్షింపనివాఁడు

216) అనిమిషః ; సత్సు న నిమిషతీతి ; ఆశ్రితులకటాక్షింప
కుండ నిల్వలేనివాఁడు

217) స్రగ్వీ, తిరస్కృత్వపి పరత్వసూచనవైజయంతీ స్రగస్యా
స్త్యస్యాంగినేతి ; తిరస్కృతమైన మానవరూపమునందును
పరత్వసూచకమైన వైజయంతీమాల ధరించినవాఁడు

218) వాచస్పతిః ; సవేదశ్రమమన్న మత్స్యపురాణ వేదోపబృంహ
ణాత్ ; మానవమై వేదోపబృంహణమైన మత్స్యపురాణ
మును జెప్పినవాఁడు

219) ఉదారధీః ; సర్వజ్ఞుఁడైనవాఁడు

220) అగ్రణీః ; తేన ప్రకారేణ, అగ్రిమం పశ్చిమం పదం నయతీతి ;
అట్లు మానవరూపియై ముందున్నవారిని వెనుకకుఁ బోవునట్లు
చేయువాఁడు) అనఁగా విహరించినవాఁడు

221) గ్రామణీః ; తత్రచ నిత్యసిద్ధానాం గ్రామం సమాజం నయతీతి

అప్పటికి నిత్యసిద్ధుల సమాజమును గానిపోయినవాడు

222) శ్రీమాన్, స్పష్టమైనపరత్వైశ్వర్యముగలవాడు

223) న్యాయః, యుక్తాయుక్తమునాచరించువాడు

224) నేతా, నియుక్తంవర్తతేతి, కార్యనిర్వాహమునర్చినవాడు

225) సమీరణః, ఏవమిష్టచేష్టః విహరతీతి, ఇట్టులిష్టచేష్టితుడై విహరించువాడు

226) సహస్రమూర్ధా, అసంఖ్యేయములైనశిరస్సులుగలవాడు

227) విశ్వాత్మా, విశ్వమును వ్యాపించియున్నవాడు

228) సహస్రాక్షః, అసంఖ్యేయములైననేత్రములుగలవాడు

229) సహస్రపాత్, అసంఖ్యేయములైనపాదములుగలవాడు

230) ఆవర్తనః, సంసారఘటీయంత్రపరివర్తనాత్ ప్రవృత్తిచక్రమును ద్రిప్పుచున్నవాడు

231) నివృత్తాత్మా, తతః సంసారమహావిభూతేస్త్రిపాద్విభూతికత్వేన నివృత్తముద్గతం స్వరూపం యస్యసః, త్రిపాద్విభూతియందుండి ప్రవృత్తిచక్రమునంటకయుండువాడు

232) సంవృతః, తామసానాం జ్ఞానాం గూఢత్వాత్ తామసులకు గానరానివాడు

233) సంప్రమర్దనః, సంవరణాంతమః, స్వవిద్యయా ప్రమ

క్షయతీతి, తన్నెఱుంగుటచే నజ్ఞానమును నశింపఁజేయువాఁడు

134) అహస్సంవర్తకః, కాలపరిభ్రమణమునకు హేతువైనవాఁడు

235) వహ్నిః, దేవరూపేణ విశ్వం వహతీతి, దేవరూపముతో జగత్తును వహించువాఁడు

236) అనిలః, ప్రాణనామనా ఉజ్జీవనాత్, భూతములనుజ్జీవింపఁజేయువాఁడు

237) ధరణీధరః, అన్నదిపే ధారకం ధారయతీతి, ఇతరాధారములమనాధారమైనవాఁడు.

238) సుప్రసాదః, సమ్యగ్దోషే సుప్రసాదః, అభిముఖులయందుదయగలవాఁడు

239) ప్రసన్నాత్మా, స్వతః శాంతః, సహజముగా శాంతుఁడైనవాఁడు

240) విశ్వసృక్, గుణదోషమనపేక్ష్య దయైకాన్తత్ విశ్వం సృజతీతి, గుణదోషములనుఁజూడక దయతో విశ్వమును సృజించువాఁడు

244) విశ్వభుగ్విభుః, తథైవ విశ్వం భునక్తి పాలయతీతి, అట్లే వ్యాపించి విశ్వమునుఁబాలించువాఁడు

242) సత్కర్తా, సతః సత్కరోతి, సాధువులసత్కరించువాఁడు

243) సత్కృతః, తైః సత్కృతః, వారిచే సత్కరింపఁబడువాఁడు

244) సాధుః, తదేవ భక్తైతమాత్మసాధనాది సాధయతీతి భక్తులచేఁ గోరఁబడుమాత్మసాధనాదులఁ జేయువాఁడు

245) జహ్నుః) అభక్తేష్వాత్మానం మాహాత్మ్యమపహ్నుత ఇతి) భక్తులు కానివారికి తన మాహాత్మ్యములను ప్రకటింపనివాఁడు

246) నారాయణః) నారాయణుఁడైనవాఁడు

247) నరః) అనశ్వరచిదచిద్విభూతికః) నశింపని చిదచిద్విభూతిగలవాఁడు

248) అసంఖ్యేయః) అసంఖ్యేయములైన బ్రహ్మాండములుగలవాఁడు

249) అప్రమేయాత్మా) అసంఖ్యేయ జగద్భావనాత్) అసంఖ్యేయ బ్రహ్మాండభావనముఁ జేయుటచే నప్రమేయుఁడైనవాఁడు

250) విశిష్టః) స్వతః విలక్షణః) సహజముగా విలక్షణుఁడైనవాఁడు

251) శిష్టకృత్) స్వసంబంధేన తాన్ సాధూన్ గుణవతః శిష్టాన్ కరోతి ఇతి) తనసంబంధముచే వారిని తనకనుగుణముగా శుభులనుఁ జేయువాఁడు

252) శుచిః) తరుగని తేజస్సుగలవాఁడు

253) సిద్ధార్థః) స్వత ఏవ ఆప్త సమస్తకామత్వాత్) స్వయముగా అవాప్త సమస్తకాముఁడు

254) సిద్ధసంకల్పః) స్వేచ్ఛయా సాధిత సర్వార్థః) సంకల్పమాత్రమున సర్వార్థములను సాధించువాఁడు

255) సిద్ధిదః) అణిమాది సిద్ధీస్సాధకేభ్యో దదాతి ఇతి) అణిమా

ఇసిద్ధులను సాధములనిచ్చువాఁడు

256) సిద్ధిసాధనః) యస్యసాధనమపి (ప్రి)యంకరత్వాత్ సిద్ధిరూపం)
ఆరాధకులకు (ప్రి)యంకరమైన తనయారాధనము గలవాఁడు

257) వృషాహీ) ఏనాఁడే తని దర్శనము గలుగుచున్నదో ఆ దినములు
శోభనాహము అది గలవాఁడు తన దర్శనముచే సఫలముచేయ
బడిన దినము గలవాఁడు

వృషభః) వృషమభిగచ్ఛతో భవదర్శనే వర్షతీతి; సంసారతాపత
ప్తులై భావించువారికి వృష్టిప్రాయుఁడైనవాఁడు) 258

259) విష్ణుః) ఏవం వర్షన్ వేవేష్టీతి; తాపములువ్యాపించియు
న్నవాఁడు.

260) వృషపర్వా) వృషావర్ణాశ్రమధర్మాః తే తదారోహణసో
పానపర్వాణోతి; వర్ణాశ్రమధర్మములే తననుఁ బొందు
టకు సోపానములుగాఁ గలవాఁడు

261) వృషోదరః) ఆరాధకానాం యథాలబ్ధం హవిరాదిభిస్సు
పూరత్వేన ధార్మికోదరత్వాత్; ఆరాధకుల హవిరా
దులచే నిండు ధార్మికకుక్షి గలవాఁడు

262) వర్ధనః) మాతృవత్ తాన్ ఉపలాల్య వర్ధయతీతి;
ఆరాధకులఁ దల్లివలె గర్భమునందుంచుకొని పోషించు
వాఁడు

263) వర్ధమానః) తానే వర్ధయన్ స్వయమపి వర్ధత ఇతి; వారిని

(పోషించుచు(ధనసమృద్ధి(కై)యుండువాడు

264) వివిక్తః) ఏవం సర్వలోకోత్తరస్వకాంతవృత్తాంతత్వాత్)
ఇట్లు సర్వలోకోత్తరమైన తనచరిత్రముగలవాడు)

265) శ్రుతిసాగరః) ఏవంప్రకారగుణప్రవణానాం శ్రుతీనాం సాగర
ఇవ సరిదోఘానాం పరమాపర్యవసానభూమిరితి) సరి
(త్ప్ర)వాహములకు సముద్రమువలె వేదములకు పర్యవసానభూ
మియైనవాడు)

266) సుభుజః) ప్రపన్నభరధురన్ధరశోభనభుజః) ప్రపన్నుల
భారమును భరించు శోభనములైన భుజములుగ
లవాడు

267) దుర్ధరః) తాదృశభుజబలేన పరైర్దుర్ధారవేగః)
అట్టిభుజములచే నితరులచే వారింపరాని వేగము
గలవాడు

268) వాగ్మీ) ప్రశస్తతయా వాగస్యాస్తీతి) కొనియాడదగి
నవాక్కుగలవాడు

269) మహేన్ద్రః) సర్వతోముఖం ప్రసృతత్వాత్ మహాజ్యేష్ఠమై
శ్వర్యః) సర్వతః వ్యాపించిన మహైశ్వర్యముగలవాడు

270) వసుదః) లఘుభోగ్యధనదాదిభోగ్యధనం దదాతీతి) అల్పము
లైన కుబేరాదులకు ధనములిచ్చువాడు

271) వసుః) గరీయసాం స్వయమేవ ధనమితి) గొప్పవారికిని
తానే ధనమైనవాడు

272) నైకరూపః) యథోక్తమహిమోచితవైశ్వరూప్యః) ఉక్త మహిమమునకుచితమైన విశ్వరూపము గలవాఁడు

273) బృహద్రూపః) వప్వైకైకమేవ విజ్ఞానమావకాశం వ్యాప్య బృహద్రూపమస్యేతి) అట్టి బహురూపములలో నొక్కొక్కరూపము తానే సర్వదిక్కుల వ్యాపించునట్టి రూపము గలవాఁడు

274) శిపివిష్టః) శిపయః రశ్మయః తైర్విష్టః యుక్తః) కిరణములతోఁ గూడినవాఁడు

275) ప్రకాశనః) దివ్యరూపం దివ్యచక్షుర్భ్యో దర్శయతీతి) కిరణయుక్తమైన దివ్యరూపమును జూపుటకుఁ బ్రకాశింపఁజేయువాఁడు

276) ఓజస్తేజోద్యుతిః) ఓజః బలం, తేజః పరాభిభవనసామర్థ్యం ద్యుతిః ఔజ్జ్వల్యం, తాని ధరతీతి) బలము తేజము ఔజ్జ్వల్యము గలవాఁడు

277) ప్రకాశాత్మా) మూర్ఖైరపి సంప్రతిపన్న పరప్రభావః మూర్ఖులచేఁ గూడఁ దెలిసికొనఁబడిన పరత్వప్రభావము గలవాఁడు

278) ప్రతాపనః) తపింపఁజేయు కాంతి గలవాఁడు

279) ఋద్ధః) కూలముద్వహంస్త్వర్వార్ణవ ఇవ ఋద్ధః) కూలముల నాశ్రయించియున్న పార్వారసముద్రమువలె సమృద్ధి గలవాఁడు)

280) స్పష్టాక్షరః) ప్రతిపాదనతయా స్పష్టకృతవేదాక్షర ఇతి
స్పష్టమైన వేదాక్షరములుగలవాఁడు

281) మంత్రః) మంతారం త్రాయత ఇతి) స్మరించువానిని రక్షించువాఁడు

282) చంద్రాంశుః) మంత్రాంశానాం మహాహ్లాదనతేజస్త్వాత్) తన్నుస్మరించువారికి శ్రమమును దించి
సంతోషమును గూర్చు తేజస్సుగలవాఁడు

283) భాస్కరద్యుతిః) పరేషాం పరిభావుకప్రభావత్వాత్) శత్రువులను బరిభవించు తేజస్సుగలవాఁడు

284) అమృతాంశూద్భవః) సర్వతాపహారాత్మ
-యుత అమృతసంజీవనామృతమయాంశుః) చంద్ర
ఉదితస్సన్) శైత్యాదిగుణోపస్నిగ్ధత్వాత్ తదుద్భవత ఇతి
వనిమనః) శైత్యాతిశయంగల్గుటవలననే చంద్రుఁడు
సూండ లోహ్లాదకుఁడై క్షీణించియు వృద్ధిఁబొం
దుచునమృతమయుఁడగుచున్నాఁడు

285) భానుః) అతిభాస్వరేణ సహస్రాంశునా ప్రప
ఽచేష్టతే జుషోతోతి) సూర్యునకుఁ గూడనాధార
మైన తేజస్సుగలవాఁడై ప్రకాశించువాఁడు)

286) శశబిందుః) శశానాం కుటిలగతీనాం) బిందుర్
ఫలహితా) కుటిలవర్త్తములకు (గనబడనివాడు
287) సురేశ్వరః) ఋజుగతీనాం నిర్వాహకః) ఋజు
వర్త్తములకు నిర్వాహకుడైనవాడు.
288) ఔషధం) భవతీవ్ర విషహారప్రభావాత్) సంసా
రఘోరవిషమును హరించుటకు ఔషధమైనవాడు
289) జగతస్సేతుః) సదసద్వర్గ సంకరవిరోధిత్వాత్)
సదసత్తులు కలిసి సంకరము కాకుండ నెల్లమర్య
దావిధి నడపువాడు.
290) సత్యధర్మపరాక్రమః) ధర్మాః కల్యాణగుణాః
పరాక్రమాశ్చ సత్యాని చ సత్యా అవితథా యస్య
సః) వ్యర్థముగాక సత్యములైన కల్యాణగుణా
[illegible]ములు గలవాడు
291) భూతభవ్యభవన్నాథః) సార్వజ్ఞ్యం న కేవలమత్ర
కింతు త్రికాలేష్వపి) మూడు కాలములందును
దన సార్వజ్ఞ్యము గలవాడు) సార్వజ్ఞ్యమనఁగాఁ ప్ర
భుత్వము)
292) పవనః) సర్వదా సర్వత్ర స్వభావాదేవ పునా

తేతి) ఎల్లప్పుడు నెల్లయెడల సహాయము గానే పవిత్రము

చేయువాఁడు

293) పావనః) స్వసంబంధినో గంగాదీన్ జగత్పునాన్ ప్రయోజయతీతి) తన సంబంధులగు గంగాదులను లోకములఁ బవిత్రము చేయుటకు నియమించువాఁడు

294) అనలః) బహుమహిమశక్తిసంపదాం నాలం, నపర్యాప్తమస్యానుగ్రహమహిమ్న ఇతి) బహువిధములగా నుపకారము చేసియుఁ దృప్తినొందని యనుగ్రహము గలవాఁడు

295) కామహా) స్వగుణదర్శినాం విషయాంతరవిషయస్పృహం హంతీతి) తన కల్యాణగుణములననుభవించువారికి విషయాంతరవాంఛలు పోఁగొట్టువాఁడు

296) కామకృత్) భోగమోక్షాదికామ్యములను దానే యిచ్చువాఁడు

297) కాంతః) స్వయం సౌందర్యసాకుమార్యాదిరూపగుణైః కాంతః) సౌందర్యసౌకుమార్యాదిరూపగుణములచే స్వయముగా మనోహరుఁడైనవాఁడు)

298) కామః) శలోధార్థ్యదయా విభిరాత్మమక్షైర్వేకామ
కమనీయత్వాత్, శలోధార్థ్యములగు నాత్మసుఖ
ములచే ముక్తిలి మనోహరుడైనవాడు)

299) కామప్రదః) స్వకామభక్తేభ్యః ప్రకామభక్తేభ్యో య
థాక్తం కామం ప్రదదాతీతి) తననుగోరువారికి
ష్టప్రకామములనుగోరువారికి నెల్లరకు దానేకామ్యే
ములయథార్థముగా నిచ్చువాడు

300) ప్రభుః) నితాంతకాంతతయా సర్వహృదయహా
రకో ప్రభవతీతి) మనోహరత్వముచే సర్వుల
హృదయమునపహరించుసమర్థుడు

తృతీయశతకము సంపూర్ణము

చతుర్థశతకప్రారంభః

301) యుగాదికృత్) యుగస్యాదింతే ప్రారంభం కరోతీతి) యు
గాంతమునందును మరలజగత్తులసృష్టించి యుగా
రంభమునచ్చువాడు

302) యుగావర్తః) స్వధర్మవ్యవస్థయా కృతాదియు
గానాం పౌనఃపున్యేనానువర్తనాత్) వానివా
నిధర్మములుచక్కగానడచునట్లు కృతాదియుగములనావ
ర్తలమగలగుచవర్తింపజేయువాడు

303) నైకమాయః) మృగశిశురూపాపరిమితజగన్నిగరణానిరా
లంబనైకోదకవటదళశయనాద్యనేకాంతర్యాశ్చర్యకః)
శిశురూపమును ధరించుటు, జగత్తులమ్రింగుటు, నిరా
లంబనమైన వటపత్రమున జలంబుల శయనించుట
మొదలగు అతర్క్యములైన యాశ్చర్యములు గలవాఁడు

304) మహాశనః) నిఖిలజగన్నిగరణమస్యేతి, సర్వలోక
ములమ్రింగువాఁడు

305) అదృశ్యః) అతర్క్యవృత్తాంతః) ఊహింపరాని వృ
త్తాంతములు గలవాఁడు

306) వ్యక్తరూపః) అభిగచ్ఛతో మార్కండేయాదేః సు
గ్రహదివ్యవిగ్రహః) భక్తులగు మార్కండేయా
దులకు దెలియఁబడిన విగ్రహము గలవాఁడు

307) సహస్రజిత్) సహస్రయుగసంఖ్యాంకల్పాంతంశ
యానోజయతి) వేయియుగములు జయింప
చునిద్రించువాఁడు

308) అనంతజిత్) పరిమితశిశురూపస్సన్నపి కశ్చిత్
మహిమావధివిప్రకర్షినాస్తి) పరిమితశి
శురూపము కలిగియున్నను కాలఁతే పెట్టురాని మ
హిమగలవాఁడు

309) ఇష్టః) ఉత్తరేణ ఫలత్వేనుష్ఠైన రష్టవిశేషణాజనయిత్రే
వవాంఛితః) గర్భగోళమునను ంచుకొనఁబడినసర్వ
భూతకోటిచేఁ దప్పివెలె వాంఛింపఁబడువాఁడు
310) అవిశిష్టః) అందఱికి విశేషములేక యిష్టుఁడైనవాఁడు
311) శిష్టేష్టః) పండితాగ్రణీనాం మార్కండేయాదీనాం పర
మపురుషార్థత్వేనేష్టః) పండితులైన మార్కండే
యాదులకుఁ బరమపురుషార్థమగుటచే నిష్టుఁడై
నవాఁడు
312) శిఖండీ) శిఖండం పరమం తేజః) అస్యాతిశయితమి
తి) అతిశయించిన పరమతేజస్సుగలవాఁడు
313) నహుషః) స్వమాయయా జీవాన్నహ్యతి బధ్నాతీ
తి) తనమాయచే జీవులబంధించువాఁడు
314) వృషః) అమృతోష్మయా స్వకాంత్యా వాచా చేనాం
గరపోన్నదరాటనశ్రాంతమాశ్వాసయన్ సించతీతి)
సముద్రగర్భమునఁ దిరుగుడువడియలసిన మార్కండే
యునాశ్వాసించి తనయమృతప్రవాహమైనకాంతిచే
తను [illegible] వాక్కుచే తనుఁ దడిపినవాఁడు
315) క్రోధహా) త్రిస్తృప్తి వారం నరపతినిరాసకరం క్రోధం
కార్త్స్న్యప్రార్థనామాత్రేణ హతవాన్) ఇరువదియొ
కమారు రాజులవధించి కృత్స్నప్రార్థనచేఁ గోపమునుడిగిపిన
వాఁడు

